మానవ సమాజ అభివృద్ధి అటు భౌతికంగానూ, ఇటు పారమార్థికంగానూ కొనసాగాలనేది మన జీవన సంప్రదాయంలోనే ఉన్నది. కేవల భౌతిక అభివృద్ధితో సరిపెట్టుకోకుండా.. జీవితానికి కావలసిన ఆధ్యాత్మిక సాధన వైపు మన వేద, శాస్త్ర ఆగమాలు నడిచాయి. మనిషికి కావలసిన ఆధ్యాత్మిక చైతన్యాన్ని, భక్తి ప్రబోధాన్ని అందించడానికి దేవాలయాలు ఏర్పడ్డాయి. పండితుడైనా పామరుడైనా భగవంతుడి భగవత్ తత్త్వాన్ని తెలుసుకునేందుకు దేవాలయాలు ఎంతో దోహదపడ్డాయి. సమస్త విద్యలకు, సమస్త కళలకు, సమస్త ఉపాసనా విధానాలకు కేంద్ర బిందువుగా దేవాలయాలు ఉండేవి. దేవాలయాలు నిత్య జీవితంలో ఎంత కీలక స్థానాన్ని ఆక్రమించాయో వేల సంవత్సరాల క్రితమే తిరునావుక్కరసు నయనార్ ఇలా పేర్కొన్నారు.

**" ఏ పట్టణంలోనైతే దేవతామూర్తి మంగళాశీస్సులు కురిపించే దేవాలయం కొలువువై ఉండదో;**

**ఏ మానవనివాస స్థానమైతే పేదల సేవలో తరించదో;**

**ఎక్కడైతే మనిషి ఫాలభాగం, భగవంతుడి పవిత్రవిభూతి రేఖలు అలదుకొని ఉండదో;**

**ఎక్కడైతే భక్తులు, ఆ భగవంతుడి నామసంకీర్తనలో ఓలలాడుతూ, సంపూర్ణ భక్తిభావంతో ప్రార్థనలు సలుపరో;**

**ఎక్కడైతే శంఖధ్వనితో ఆలయంలో పూజాదికాలు ప్రారంభించి ఆచరణయుతంగా నిర్వహించరో;**

**ఎక్కడైతే ఆలయ వార్షిక ఉత్సవాలు నియమబద్ధంగా జరుగవో, శోభాయమానంగా, వీధివీధులన్నీ రంగవల్లులతో అలంకృతమై సుందరపూలమాలలతో దేవదేవుడికి స్వాగతం పలుకవో;**

**ఎక్కడైతే స్థానిక నివాస భక్తులు స్వచ్ఛమైన పుష్పాలతో దేవుని కొలిచి, ఆయనకు అర్పించకుండా ఆహారాన్ని స్వీకరిస్తారో...**

**ఆ ఆవాస స్థానం నివాసయోగ్యం కానిది... కేవలం వన్యమృగాలు తిరుగాడే అటవీస్థలంతో సమానమైనది."**

దేవాలయాలు ప్రజల సామూహిక ఉమ్మడి ఆస్తి. అందువల్ల వాటి నిర్వహణలో చాలా కట్టుదిట్టమైన వ్యవస్థ ఉండాలని ఆగమాలు కోరుకున్నాయి. ఈ ఆగమ విజ్ఞానం పరమేశ్వరుడి ముఖం నుంచి స్వయంగా వెలువడింది అని శాస్త్ర వాక్యం. శివాలయాల నిర్వహణకు సంబంధించి ఇరవై ఎనమిది ప్రధాన ఆగమాలు పేర్కొంటున్నాయి.

తెలుగు రాష్ట్రాలలో ప్రధానంగా కారణాగమం విస్తృతంగా ప్రచారంలో ఉన్నది. ఆగమ శాస్త్ర వ్యాప్తికి విశేషంగా కృషి చేస్తున్న బ్రహ్మశ్రీ మామిళ్లపల్లి మృత్యుంజయ ప్రసాద్ గారు. ఇంతకు పూర్వం "శైవ ప్రతిష్టావిధి:" అనే పేరుతో శివాలయ ప్రతిష్టకు సంబంధించిన సంకలనాన్ని ప్రచురించారు. ఆగమ జిజ్ఞాసువులకు ఆ పుస్తకం విశేషంగా ఉపయోగపడింది. ఇప్పుడు ప్రతిష్టావిధి: ద్వితీయ భాగాన్ని మొట్టమొదటిసారిగా తీసుకు వస్తున్నారు. దీంట్లో రెండు విశేష అంశాలు ఉన్నాయి. ఒకటి, తెలుగులో భావార్థ సహితంగా రావడం వల్ల సాధారణమైన అర్చకులకు కూడా విశేషంగా ఉపయోగపడుతుంది అనడంలో సందేహం లేదు.

ముఖ్యంగా, ఇందులో ప్రాయశ్చిత్త విధులు పేరుకొనబడ్డాయి. 1. ప్రతిష్టా సమయంలో. 2. ఉత్సవాల్లో. 3. అర్చనా విషయంలో ప్రాయశ్చిత్త విధులు విశేషంగా పేరుకొనబడ్డాయి. ఉదాహరణకు, 1. మంత్రలోపము 2. క్రియాలోపము 3. ద్రవ్యలోపము మొదలైనవి సంభవించినప్పుడు వాటిని పరిహరించేటప్పుడు ఎలాంటి ప్రాయశ్చిత్త క్రియలు చేయాలో పేర్కొన్నారు. ఇదే కాక అనేక ప్రమాదాలు, అనూహ్యమైన మరణములు జరిగినప్పుడు పరిహారంగా చేయవలసిన ప్రక్రియలను పేర్కొన్నారు. ఇందులో నాలుగవ అధ్యాయంలో ప్రతిష్టా విధిలో చేయవలసిన వివిధ ప్రక్రియలకు సంబంధించిన పరిభాషలు నిర్వచించబడ్డాయి. ఐదవ అధ్యాయంలో ఉత్సవ విషయంలో చేయవలసిన అనేక ప్రక్రియలు, వాటి వివరణలు ఇచ్చారు. నిత్యార్చన విషయంలో పాటించవలసిన సాధారణ అంశాలు విశేష అంశాలు కూడా చాలా చక్కగా సేకరించి అందించారు. ఉదాహరణకి త్రిపుండ్ర ధారణ ఎలా ఉండాలి, ఏ ప్రమాణంలో ఉండాలి ? ఘంటా తాడనం వల్ల ప్రయోజనం ఏమిటి, ధూప దీప లక్షణాలు ఏమిటి ? వివిధ రకాల ఉదకాలు వాటి లక్షణాలు ఏమిటి అనేది ఇందులో పేర్కొన్నారు. యజ్ఞ శాల , అగ్ని కుండముల నిర్మాణము ఎలా చేయాలి అనేది కూడా ఈ పుస్తకములో చూడవచ్చు. ముఖ్యంగా ఇందులో సప్తమాధ్యాయంలో వివిధ రకాలైన కొలతలు వాటిని ఆధునిక కొలమానాల్లోకి మార్చి చూపించడం విశేషం. బరువు ,

ఎత్తు , మొదలైన ప్రమాణాలకు నిర్వచనాలు, వాటికి ఆధునిక సమన్వయం ఇందులో విశేషంగా ఉన్నది.

తెలుగులో భావార్థ  సమన్వయంతో ఎంతో శమదమాదులకు ఓర్చి ఆగమ జ్ఞాన తేజాన్ని ఉదారంగా ఈశ్వరార్పణ బుద్ధితో అందిస్తున్న బ్రహ్మశ్రీ మృత్యుంజయ ప్రసాద్ గారి కృషి అభినందనీయం.

ఏ పనులతో మనమూ తరించి,  ఇతరులను తరింపచేస్తామో, వాటినే ఉత్తమమైన పనులు అనవచ్చును. అలాంటి పనులు పరమేశ్వరానుగ్రహం వలనే మనకు లభిస్తాయి. మనం చేసే పనుల్లో కొన్ని మరీ విశేషంగా ఉంటాయి. వారు రాసిన ఈ శైవ ప్రతిష్టా విధి(ద్వితీయ భాగం) ఆయనకు పుణ్యాన్ని, లోకానికి భాగ్యాన్ని కలిగిస్తున్నాయి.

నమశ్శివాయచ శివతారాయచ